# శ్రీ పేరిచర్ల సీతారామరాజు (మాగాం కుటుంబం)




## "పురావస్తు సంగ్రహణ తపస్వి", "నాణెంపుపనిజాణ"
## "క్రీడారంగ ధనంజయుండు"
## శ్రీ పేరిచర్ల సూర్యనారాయణరాజు

( వేంపాడు, ఎలమంచిలి తాలూకా, విశాఖ జిల్లా )

జననం : 23-11-1933 రాత్రి గం॥ 2-14 ని॥లకు - పిఠాపురమున. తల్లి శ్రీ కళ్ళేపల్లి సూర్యనారాయణరాజుగారి కుమార్తె శ్రీమతి లక్ష్మీనరసమాంబ: తండ్రి శ్రీ చంద్రరాజుగారు. వివాహము: 4-4-1953 దువ్వలో జరిగినది. భార్య: శ్రీ వేమనమంద వెంకటాద్రిరాజు. సూర్యకాంతంగార్ల సుత కృష్ణవేణి. శ్రీ పేరిచర్ల సూర్యనారాయణరాజుగారిని వారి మేనత్త పెన్మెత్స సూరమ్మగారు చిన్నప్పుడు తేతలిలో పెంచారు. రాజుగారు 1947 సం॥ లగాయతు 1953 వరకు తణుకు బోర్డు హైస్కూలులో చదివి ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలో ఉత్తీర్ణులైనారు. 1954-1956 మధ్య కాకినాడ పి. ఆర్. కళాశాలలో ఇంటర్మీడియట్ చదివారు.

## నాణెముల సేకరణ :-

శ్రీ పేరిచర్ల సూర్యనారాయణరాజుగారు 1949 సంవత్సరము జూలై నెల 3వ తేదీన నాణెముల సేకరణకు శుభారంభము చేసినారు. తణుకులో 8 వంపులుగల ఒక పావలానాణెమును తొలుతగా అబ్బురపడి దాచిన ఆరోజు మంచిరోజు. యంత్ర నిర్మితమైన నాణెములను గ్రహించుటకని శ్రీకారము చుట్టుటాయెను. 1950వ

సంపత్సరముల యంత్ర నిర్మితములు కాని నాణెముల సేకరణ ప్రారంభించిరి. ఆదియును ముస్లిములకు చెందినవానితో. ఈ మహాకార్యమున వీరు తేతలి, తణుకు, వేంపాడు (పలుమంచిలి తా॥), పెదతిరుపతి, మద్రాసు, హైదరాబాదు, కంచి, కాళహస్తి, మహాబలిపురము, మైసూరు, బెంగుళూరు, విజయవాడ, విశాఖపట్టణము, రాజమండ్రి, కాకినాడ, కడప, అనంతపురము మున్నగు ఆంధ్ర ఆంధ్రేతర నగరములను దర్శించి పరోపకారాసక్తితో, ఏకదేకచింతనముతో నాణెములను సేకరించిరి. కలకత్తా, కాశీ, గౌహాతి, ఢిల్లీ మున్నగు ప్రాంతములలో రాజుగారు నాణెములను సేకరించిరి. ఏ ప్రాంతమునకు కాలినడకయైన వెడలినను, ఎచ్చట తిరిగినను దృఢతరదీక్షతో నాణెములకై వెదకి, గాలించి శోధించి, సంగ్రహించిరి, ప్రోగుజేసిరి. ఒకటొకటి పందలైనవి. పందలు చేరి వేలు అయినవి. అవి నేటికి రెండువేల రెండువందల రకములయినవి. శ్రీరాజుగారి నాణెముల సేకరణము ఆంధ్రదేశమునందేగాక భారతదేశమునందే గణనీయమైన సేకరణములలో నొకటియై, శ్రేష్ఠమై, పుష్టమై, దీప్తమై, నిక్షిప్తమై, అపురూపమై అగ్రస్థానము వహించి వాసిల్లుచున్నది. వీరివద్ద బంగారము, వెండి, రాగి, సీసము, ఇనుము, పోటీను (త్రిలోహామిశ్రమము); బిలన్ (త్రిలోహామిశ్రమము) మున్నగు లోహములతో తయారుచేయబడిన నాణెములు కలవు.

599

## సేకరించిన నాణెముల వివరములు :-

1. హిందూదేశము ప్రాచీన కాలమునకు చెందినవి : 1. మౌర్యులకాలము 3 CBC - పంచ్ మార్కుడ్ కాయిన్ (2) : 2. గాంధార దేశము (తక్షిల-తక్షశిల) 2 CBC నుండి 1 C B C (4) : 3. శాతవాహనులు 1 C B C నుండి 2 C A D - 6 గురు రాజులవి - 8 రకములు (104): 4. ఇండో కుషానులు 1 CBC నుండి 2 C A D (6): 5. శాతవాహన సమకాలికుడు చిలివాయకురుడు 1 C B C నుండి 2. C A D (1) : 6. పాశ్చాత్యక్షత్రపులు 2 C A D నుండి 3 C A D (1) 7. ఇండో ససేనియన్ 3 C A D (2): 8. ఇక్ష్వాకులు 3 C A D నుండి 4 CAD (3): 9. సాలంకాయనులు 4 C A D నుండి 5 C A D (1): ఈ నాణెము ప్రపంచములో ఇప్పటివరకు అపరిచితమని చరిత్రకారుల తలంపు. 10. విష్ణుకుండినులు 5 C A D నుండి 6 C A D (7): 11. కళింగగాంగులు - 7 C A D - బంగారు నాణెములు (2): 12. చోళులు 10 C A D నుండి 12 C A D (16)

13. చేరులు 10 C A D నుండి 11 C A D (6); 14. పాండ్యులు 11 C A D నుండి 12 C A D (1); 15. కాకతీయులు 12 C A D నుండి 13 C A D (1); ఈ నాణెము గణపతి దేవునకు చెందినది. ఇది ఎక్కాలి అయినైన నాణెమనియు, ఇంతకుముందు ఇట్టి నాణెము వెల్లడికాలేదనియు పరిశోధకులు వ్రాకుచున్నారు. ఏషియాఖండ దేశములో ఏమ్యూజియంలోను లేని నాణెములు శ్రీ రాజుగారివద్ద కలవు.

II మధ్యకాలమునకు చెందినవి:- 16.టర్క్సు:- మహమ్మద్ బిన్ శామ్ (1193-1206A.D.)(3); నజీరుద్దీన్ (1246-66) (1); ఘియాసుద్దీన్ బాల్బన్ (1266-87)(3): (1287-90) (2): +(2); 17. ఖిల్జీలు:- జలాలుద్దీన్ ఫిరోజషా (1290-96) (2); అల్లాయుద్దీన్ మహమ్మద్ షా (1296-1316) (30): కుతుబుద్దీన్ముబారక్షా (1316-18) (3): 18. తుఘ్లకులు :- మహమ్మద్ తుఘ్లక్, ఘియాసుద్దీన్ తుఘ్లక్ I (1320-25) (11): మహమ్మద్ బిన్ తుఘ్లక్ (1325-51) (40): 19. బహమనీ సుల్తానులు :- అల్లాయుద్దిన్ బహ్మన్ షా (1347-58) (9) ; మహమ్మద్షా I (1358-75) (24); అల్లాయుద్దిన్ ముజాహిద్షా (1375-78) (1) : మహమ్మద్షా II (1378-97) (19); తాజుద్దిన్ ఫిరోజ్షా— గుల్బర్గా-(1397-1422) (33); అహమ్మద్షా I వలీ (1422-35) (17); అల్లాయుద్దిన్ అహమ్మద్షా II (1436-57) (32); హుమయూన్షా (1458-61) (3): నిజాముద్దిన్ అహమ్మద్షా III -బీదర్-(1461-63) (1): మహమ్మద్షా III-లష్కరి-1463-82) (11): మహమ్మద్షా (1482-1518) (18); వలీ ఉల్లాషా (1522-1523) (7): కలీముల్లాషా (1524-26) (63): 20. మాళవదేశపరిపాలకులు :- ఘియాస్షా ఖిల్జీ (1468-1500) (14): నజీర్షా ఖిల్జీ (1500-1510) (3); మహమ్మద్ షా II. ఖిల్జీ (1510-31) (71): ఈ నాణెములు ఏషియా హిందూదేశపు మ్యూజియంలలో లేవు. అమీర్ బరీద్ షా (1504-42) (3): 21. మొఘలాయిలు:— జలాలుద్దిన్ అక్బర్ (1556-1605) (1): నూరుద్దిన్ జహంగీర్ [1605-27] [2]: షాజహాన్ (1628-57) (3): ఔరంగజేబు ఆలంఘిర్ [1658-1707] (6): షా ఆలామ్ II [1]: మహమ్మద్ షా (1719-48) (6): అజీజుద్దిన్ ఆలంఘిర్ II (1754-1759) (8): 22. షేర్షా 948హిజ్రీ (1): 23: ఇస్లామ్షా 959 హిజ్రీ (1) 24. గోల్కొండ కుతుబ్ షాహీలు :— మహమ్మద్ కులీకుతుబ్షా (1580-1612) (3): అబ్దులా కుతుబ్షా [1626-72] [35]: సుల్తాన్ అబ్దుల్లాకుతుబ్షా [1635-72] [10]: అబ్దుల్ హసాన్ కుతుబ్షా [1672-87] [2]: 25. బరీద్ షా 16. C A D [3]: 26. ఆదిల్షాహీలు:- ఆలీ

ఆదిల్‌షా [1558-80] 2: ఇబ్రహీమ్ ఆదిల్‌షా I [1580-1627] [1]: మహమ్మద్ ఆదిల్‌షా [1627-57] [8]: సికందర్ ఆదిల్‌షా [1672-86] [6]: 27. నిజామ్‌షాహీలు:- ముర్తుజానిజామ్‌షా [1565-88] [2]: బర్హాన్ నిజామ్‌షా II [1591-95] [5]: ముర్తుజానిజామ్‌షా II [1603-30] [4]: 28. మహారాష్ట్రులు:- శ్రీరాజా శివాజీ ఛత్రపతి [17 C A D నుండి 18 C A D] [4]: 29 విజయ నగరం [16 C A D నుండి 19 C A D] [13].

## III ఆధునిక కాలము :-

30 గోల్కొండ అసఫ్ జాహీలు : – నజీరుద్దౌలా నిజామ్ IV [1845] [4]:అఫ్జలుద్దౌలా అసీఫ్‌జా V [1836-68)[3]; అఫ్జలుద్దౌలా అసీఫ్‌జాVI [1863] [12] : మీర్‌మహబూబ్ అలీఖాన్ అసీఫ్‌జా VII [1860-1911] [1] + 7. 31. టిప్పుసుల్తాన్ 18 C A D [8]: టిప్పుసుల్తాన్ కంపెనీలు [5]: మైసూరు టిప్పు సుల్తాన్ [12]: బెంగుళూరు టిప్పుసుల్తాన్ (3): టిప్పు సుల్తాన్ ఇతరములు [5]: దక్షిణ హిందూదేశపు నాణెములు [40]: పోలిక పట్టని నాణెములు [100]

## IV హిందూదేశపు దేశీయ నాణెములు:-

అల్వార్ [1]: భావల్‌పూర్ (1): బరోడా [5]: భోజ్ [1]; బికనీర్ [1]: గుజరాత్ (2): గ్వాలియర్ (7): హైదరాబాదు [30] ఇండోర్ [8]:జోధ్‌పూర్(3) జునాగఢ్ [1]: నేపాల్ [6]: పుదుక్కోట [2]: రాజస్థాన్ [4]: తిరువాన్‌కూర్ [12]: ఉదయపూర్ [6]: పూజానాణెములు [8].

## V స్వాతంత్ర్యాగమనములగాయుతు హిందూ దేశపు నాణెములు:-

సుభాష్ చంద్రబోస్ - ఆజాద్‌హింద్ (1947 A D ) (1); ఇండియా ప్రభుత్వము (20): భారత్ (140).

## VI స్మారకార్థపు ఉత్సవముల (Commemorative) నాణెములు:-

వ్యాప్తి చెందిన నాణెములు (18); వ్యాప్తిజెందని నాణెములు (2): టంకసాల తప్పిదపు నాణెములు (6).

## VII ఇండియాలో యూరపియనులచే జారీచేయబడిన నాణెములు :-

పోర్చుగీస్ ఇండియా (12); డచ్ ఇండియా (2): ఫ్రెంచ్ ఇండియా (2): ఈస్టు ఇండియా కంపెనీ (32): బ్రిటిష్ ఇండియా (170).

## పరదేశీయుల నాణెములు :-

స్మారకార్థపు ఉత్సవముల నాణెములు (2): రజితోత్సవ నాణెము (1).

## పతకములు :-

బహుమానపతకములు (5): యుద్ధపతకములు (2): అన్యదేశపతకములు (4).

## గుజరాతునాణెములు (2)

## తప్పు నాణెములు :-

దొంగ నాణెములు - Forgery coins (5).



## I ఆఫ్రికా :-

డచ్ ఓస్టాఫ్రికా-జర్మన్ వలసప్రదేశము ( Deutsch Ostafrika - German Colony ) (2): తూర్పు ఆఫ్రికా (6): ఘానా (1): కెన్యా (1): మడగాస్కర్ (1); మారీషియస్ ద్వీపము (2). మొజాంబిక్ (3): సీషెల్స్ ద్వీపము (1): దక్షిణ ఆఫ్రికా (7): సుడాన్ (6): ట్యునీషియా — ఉత్తర ఆఫ్రికా (2); పశ్చిమఆఫ్రికా (1)

## II అమెరికా :-

మధ్య అమెరికా, కెరీబియన్ - మెక్సికో (2): ఉత్తర అమెరికా :- కెనడా (2); యు. ఎస్. ఎ. U. S. A. (30). దక్షిణ అమెరికా :- అర్జెంటీనా (12): కొలంబియా (3): పెరూ (1): ఉరుగాయ్ (2).

## ఆసియా :-

ఆఫ్గనిస్థాన్ (10): బహ్రైన్ (3): బంగ్లాదేశ్ (3): భూటాన్ (2): బ్రిటిష్ బోర్నియా (6); బర్మా (20): చైనా (10): [illegible] (4): హాంగ్‌కాంగ్

(6): ఇండోనీషియా (1): ఇరాన్(5); ఇరాక్ (10): ఇజ్రాయిల్ (6): జపాన్(15) (15): కువాయిట్ (1): లెబనాన్ (1): మలేషియా (2): మంచూరియా (1): మలయా (10): నేపాల్ [31]: పాకిస్తాన్ (30): పెర్షియా (6): ఫిలిప్పైన్స్ [1]: క్వాటార్, 25 దుబాయ్ (1): సామ్రాక్ - (ఇండోనీషియా - ఈస్ట్ ఇండీస్) (3): సింగపూర్ (6): శ్రీలంక (30): స్ట్రైట్ సెటిల్మెంట్స్ (7): థాయ్‌లెండ్ -సియామ్ (5): టర్కీ (10): వియట్నామ్-ఇండోచైనా (1).

## ఆస్ట్రేలియా (5); న్యూజెలెండ్ (4).

## యూరప్:-

ఆస్ట్రియా (1): బెల్జియం [2]: బల్గేరియా [1]: సైప్రస్ [3]: ఫ్రాన్స్[11] తూర్పు జర్మనీ [5]: పశ్చిమ జర్మనీ [8]: గ్రేట్ బ్రిటన్ [45]: గ్రీస్ [1]: హాలెండ్ [8]: హంగరీ [2]: నెదర్లాండ్ ఇండీస్ [8]: ఐర్లెండ్ [1]: ఐస్లేండ్ (1): ఇటలీ [17]: మాల్టా (1): నార్వే (4): పోలెండ్ (1): స్విట్జర్లెండ్ [10]: యు. ఎస్. ఎస్. ఆర్. [4]: యుగొస్లేవియా [1]: యుక్రైన్ [1] గురుతు తెలియనివి 20: అన్యదేశముల నామములు (120).

**ఆర్య మహాజనుల ప్రశంసాపరంపరలు :-** చారిత్రాత్మక కారణ జన్ములు, స్వర్గీయ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు శ్రీ పేరిచర్ల సూర్యనారాయణరాజు గారిని ఆశీర్వదించి ప్రోత్సహించిరి. రాళ్ళబండి సుబ్బారావుగారు రాజుగారికి అత్యధికమైన ప్రోత్సాహమిచ్చుటయే గాక వీరిని గూర్చి ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చి పత్రికలో "An ardent member of the society" అని గణించిరి. ఆ పత్రిక 24వ సంపుటము (1956-58) 147, 148 పుటలలో రాజుగారు వ్రాసిన తెలుగు వ్యాసమును ఆంగ్లమున అనువాదముచేసి " Recent Archaeological Discoveries in Lingarajapalem, Elamanchili Tq., Vizag Dt., " అను పేరుతో ప్రకటించిరి. అంతే ' Two ancient Roman Coins " అను రాజుగారి వ్యాసమును ప్రకటించిరి. ఆంధ్ర హిస్టారికల్ రీసెర్చ్ సొసైటీవారి పత్రిక 25వ సంపుటమున(1958-60) " Additions to the Museum " శీర్షికలో వీరి గురించి ప్రకటించిరి. 26వ సంపుటములో 27వ సంపుటములోను, సాహిత్యకార్యకలాపములో కూడ వీరి ప్రసక్తి కలదు. ఆంధ్ర హిస్టారికల్ రీసెర్చ్ సొసైటీ కేటలాగ్‌లో వీరిని గూర్చి కలదు.

యోగ్యతాపత్రములుకూడ శ్రీ రాళ్ళబండి రాజుగారికిచ్చి యున్నారు. శ్రీ రాజుగారు 1959 సం॥లో గౌహతిలో జరిగిన భారత చారిత్రక మహాసభలకు ఆంధ్రప్రదేశ్ ప్రతినిధులుగా శ్రీ మారేమండ రామారావుగారితో వెళ్ళిరి. ఆ సమావేశములయందు వీరచ్చట నాణెముల ప్రదర్శనముచేసి పలువురి మెప్పును పొందిరి 1960లో అలీఘర్‌లో ముస్లిమ్ విశ్వవిద్యాలయములో జరిగిన పై మహాసభలలో ఆంధ్రప్రతినిధులు శ్రీ మారేమండ మున్నగువారితో రాజుగారుకూడ పాల్గొనిరి. చారిత్రక పరిశోధకుడు ఆచార్య ఓరుగంటి రామచంద్రయ్య, డా॥ రాయప్రోలు సుబ్రహ్మణ్యం, శ్రీ [illegible]శయశర్మ, శ్రీ యం. వెంకటస్వామయ్య మున్నగువారు శ్రీ రాజుగారి పని నభినందించిరి. ఇందును ప్రముఖపండితులు కొందరు వీరి సేకరణాభిలాషత్వమును అభినందించియున్నారు. శ్రీ మహనాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు రాజుగారిని "నాణెంపు పనివాడు"గా, "పురావస్తు సంగ్రహణతపస్వి"గా లిఖిత పూర్వకముగా అభినందించిరి.

## వివిధ పత్రికల ప్రశంసలు :

స్వయముగ రచయిత అగు శ్రీ పేరిచర్ల సూర్యనారాయణరాజుగారు 1958 డిశంబర్ 21వ తేదీన ఆంధ్రప్రభలో, ఆంధ్రపత్రికలో, విశాలాంధ్రలో, తరువాత ప్రజామత పత్రికలలో వేరు వేరు వ్యాసములు వ్రాసిరి. వీరిని గూర్చి అనేక పత్రికలు ప్రశంసించినవి. 1977 జూలై 15వ తేదీన **The Hindu** దిన పత్రికలో " **Enthusiastic Numismatist** " అను పేరున వీరిని గూర్చి వ్రాయబడినది. పలుతావులలో జరిగిన వీరి నాణెముల ప్రదర్శనములగూర్చి ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక, విశాలాంధ్ర, ఆంధ్రప్రదేశ్, వాణి, ఆంధ్రభూమి, ఈనాడు, సమాచారమ్, హిందూ టైమ్సు, చిత్రగుప్త, మంచిరోజు, ఈరోజు, గౌతమి, వార్తాప్రచార్, నవయుగ మున్నగు పత్రికలలో ప్రశంసలు వచ్చినవి. వీరి జీవిత చరిత్రలుకూడా వచ్చినవి.

## నాణెముల ప్రదర్శనములు :-

రాజమండ్రి వీరేశలింగ పురమందిరములోను, శ్రీ గౌతమి గ్రంథాలయములోను, తదితర ప్రదేశములలోను రాజుగారి నాణెముల ప్రదర్శనములు జరిగినవి. వీరేశలింగ పురమందిరములో వీరి ప్రదర్శనము "టెలివిజన్" తీయబడినది. 1977 సెప్టెంబరు 29వ తేదీన ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రమువారు వీరితో తాము జరిపిన ఇంటర్వ్యూను ప్రసారముచేసిరి.

## చారిత్రక వస్తు బహూకరణము :

రాజమహేంద్రవర ఆంధ్రదేశీయైతిహాసికమండలికి శ్రీ రాజుగారు 2000 సంవత్సరముల నాటివి ఆంధ్రశాతవాహనుల కాలమునాటివి ఇటుకలు రెండింటిని అప్పటి మృణ్మయపాత్ర శకలములు బౌద్ధుల భిక్షాపాత్ర, గోపురము మాదిరి శంఖములు మున్నగునవి బహూకరించిరి. క్రీ. పూ. 2వ సంవత్సరంనుంచి క్రీ. శ. 14వ సంవత్సరం వరకు చెందిన టైబీరియస్ అనే మతగురువు కాల వెండినాణెములు అదే సంస్థకు బహూకరించిరి, 7వ శతాబ్దికి చెందిన విష్ణువర్ధనుని తామ్రశాసనములు 3 ప్రతులు శ్రీ పేరిచర్ల లక్ష్మీపతిరాజు గారి (గుడివాడ) ద్వారా 1959లో బహూకరించిరి.



కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్‌కు క్రొత్తరాతి యుగమునకు చెందిన రాతి పనిముట్లు 4000 సంవత్సరాలనాటివి బహూకరించిరి. పురాతనమైన గాజులు, భౌగోళిక ప్రాధాన్యముకల కొన్నివేల సంవత్సరములనాటి రాళ్ళు కూడ వారికి బహూకరించిరి.

## క్రీడాకారుడుగా శ్రీ పేరిచర్ల సూర్యనారాయణరాజు అంచెలంచెలుగా క్రీడారంగంలో విజయాలు :

ఆటలమేటి రాజుగారిని – ఇప్పటికీ ఆయనవద్ద భద్రముగ దాచబడిన ఎన్నో సర్టిఫికెట్లు బహుమానాలు చెప్పక చెప్పును! మెడల్సు, ట్రోఫీలు, సర్టిఫికెట్లు – ఆరోజులలో శ్రీ సూర్యనారాయణరాజుగారు మొత్తం 80 పొందిరి. ఈ బహుమానములు స్థానికముగ మాత్రమేగాక రాష్ట్ర దేశవ్యాప్త క్రీడారంగ ఘనం జయునిగా పొందిరి. ఈ బహుమానములు స్థానికముగ మాత్రమేగాక రాష్ట్ర దేశవ్యాప్త క్రీడారంగఘనంజయునిగా పొందిరి. 1952–53లో తణుకు బోర్డు హైస్కూలువారు " Certificate of outstanding merit " ను ఇచ్చారు. అదే సంవత్సరమున రాజుగారు పిఠాపురం కళాశాలలో ఆల్‌రౌండ్ ఛాంపియన్‌గా గెలుపొంది పి. యస్. శెట్టి బంగారు పతకమును ప్రప్రథమముగా పొందారు. శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, తూర్పు కృష్ణ, పశ్చిమ కృష్ణ జిల్లాలో జరిగిన ఆటలపోటీలలో పై ఛాంపియన్ షిప్ పొందారు. 1954లో కాకినాడలో ఇంజనీరింగ్ కళాశాలలో జరిగిన ఆంధ్ర విశ్వవిద్యాలయ అంతర కళాశాలల ఆటలపోటీలలో (అథ్లెటిక్స్‌లో) ద్వితీయ స్థానము పొందారు. ఈ ఛాంపియన్ షిప్

శ్రీ రాజుగారికి బాగుగా పేరు తెచ్చినది. ఈ ఏడాదిలోనే పిఠాపురం రాజా ప్రభుత్వ కళాశాలలో ఇండివిడ్యుయల్ ఛాంపియన్‌గా వచ్చారు. ఆంధ్రా ఎమెచ్యూర్ ఎథ్లెటిక్ అసోసియేషన్‌లో పాల్గొని ఉత్తమ బహూకృతి పొందారు. 1955-56లో అనంతపురం కళాశాలలో జరిగిన ఆంధ్ర విశ్వవిద్యాలయ అంతర కళాశాల ఆటల పోటీలలో ఇండివిడ్యుయల్ ఛాంపియన్‌షిప్‌ను అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి గారిచే బహుమతి నందిరి. 1957లో ఆంధ్రా ఎమెచ్యూర్ ఎథ్లెటిక్ అసోసియేషన్‌వారి 4వ ఛాంపియన్‌షిప్‌లో 110 మీటర్ల హైహార్డిల్సుకు. మరియు హైజంప్‌కు ప్రథమస్థానం పొందారు. 110 మీటర్ల హై హార్డిల్సు. 200 మీటర్లలో హార్డిల్సు. హైజంప్. లాంగ్‌జంపులలోను. డిస్కస్‌త్రోలోను. డిస్కస్‌త్రోలోను. 100 మీటర్లు. 200 మీటర్లు. పరుగులలోను. 4 × 100 మీటర్ల రిలేలోను. ఫుట్‌బాల్. బేస్కెట్‌బాల్. కబాడీ మున్నగు ఆటల పోటీలలోను శ్రీ రాజుగారు అనేక బహుమానములు. క్రీడాభిమానుల ఆదరాభిమానములు పొందిరి. 50 రకముల యోగాసనములు వేయుటలో పిఠాపురం రాజావారి కళాశాలలో జరిగిన పోటీలలో వరుసగా రెండుసార్లు బహుమతులు పొందారు. ఒక దండీని 60 రకములుగా తీయుటలో శ్రీ రాజుగారు ప్రత్యేకతను గడించిరి. సైకిల్ పందెము. ఈతలు ఈదుటలో. సాము గరిడీలలో. కర్రలాట త్రిప్పుటలో. సంగిడిరాళ్లు ఎత్తుటలోనూ ఈయన అనేక బహుమానాలు పొందారు. 1955-56లో ఆంధ్ర విశ్వవిద్యాలయం తరఫున బెంగుళూరులో జరిగిన అంతర్విశ్వ విద్యాలయముల ఆటల పోటీలలో వీరు పాల్గొన్నారు. ఈ ఏడాదిలోనే బెంగుళూరులోనే XXII వ జాతీయ వ్యాయామ క్రీడల పోటీలలో ఆంధ్ర జట్టు తరఫున పాల్గొన్నారు. శ్రీ రాజుగారు 1955-56 లో పిఠాపురం రాజా కళాశాలకు స్పోర్ట్సు కెప్టెన్‌గా ఎన్నికయ్యారు. 1952-53లో తణుకులో వీరు చదువుకొను సమయంలో బెస్టు హాస్టలర్‌గా బహుమానము పొందిరి.

**పెద్దల ప్రశంసా పరంపరలు** :- ఆంధ్రప్రదేశ్ గవర్నరుగా నుండిన శ్రీ త్రివేది మున్నగువారు శ్రీ వీరివద్ల కృషికి మెచ్చి సర్టిఫికెట్లు ఇచ్చారు. రాజుగారు పొందిన బహుమానాలకు దాఖలాలుగా వివిధ పత్రికలలో వార్తా విషయాలున్నాయి. ది హిందూ. స్పోర్ట్సు అండ్ పాస్టైమ్. ది మెయిల్. ది యిండియన్ ఎక్స్‌ప్రెస్. ఆంధ్రప్రభ. ఆంధ్రపత్రిక. విశాలాంధ్ర. వాహిని. ది జి. పి. ఆర్. కాలేజీమేగజీన్ పిఠాపురం. (1955-56) దిగోదావరీ రీజియనల్ ఇంటర్ డిస్ట్రిక్ట్ సెకండరీ స్కూల్ ఎథ్లెటిక్ అసోసియేషన్ మేగజీన్స్. ది వెస్టుగోదావరీ ఇంటర్ స్కూల్ స్పోర్ట్సు అసోసియేషన్. ఆంధ్రా ఎమెచ్యూరు ఎథ్లెటిక్ అసోసియేషన్. కోచింగ్ కేంప్ అఫీషియల్ సర్వీసెస్ విజయవాడ, సెప్టెంబరు 1954. XXII నేషనల్ ఎథ్లెటిక్ ఛాంపియన్‌షిప్స్ సావెనీరు. బెంగుళూరు-మొత్తంమీద 60 పత్రికలలో వీరికి క్రీడారంగమున వచ్చిన

